

యూనియన్ పిక్చర్స్ వారి "శ్రీజగన్నాధ మాహాత్మ్యం" లో నర్తకి "రోజ్."

## "ఇద్దరు పెళ్ళాలు"

నాగూర్ సినీ ప్రొడక్షన్స్‌వారు తీసిన "ఇద్దరు పెళ్ళాలు" తెలుగు చిత్రం ఇటీవల విడుదలయింది. ఎఫ్. నాగూర్ డైరెక్టు చేశారు. మాటలు, పాటలు కొపల్లె వెంకటరమణారావు వ్రాశారు. సి. ఎస్. ఆర్., రాజమ్మ, లక్ష్మీకాంత, జమున, ఎన్. టి. రామారావు, శివరావు మున్నగువారు నటించారు.

పిల్లలులేని ఒక జమీందారు (సి.ఎస్.ఆర్.)ను అతని భార్య రాధ (రాజమ్మ) పిల్లల కోసం రెండో పెళ్లి చేసుకోమని మాట వరసకు అనుగుతుంది. ఆ మాటను సాకుగా తీసుకుని జమీందారు తాను అదివరకే వలచిన పువ్వు (లక్ష్మీకాంత) అనే స్త్రీని పెళ్లి చేసుకుంటాడు. కొంత కాలం సవతు లిద్దరూ బాగానే ఉంటారు. కాని పువ్వు ముందుముందు తనకేమవుతుందో అనే భయంవల్ల జమీందారుకు రాధపై చాడీలు చెప్పి మనసు విరుస్తుంది. కొంతకాలానికి రాధ గర్భవతియై మగశిశువును ప్రసవిస్తుంది. ఆ శిశువు పుట్టగానే పువ్వు ఒక నౌకరు చేత శిశువును చెత్తకుండీలో పడవేయిస్తుంది. శిశువు చనిపోయాడని అందరితోనూ చెబుతుంది. ఆ శిశువును పేదవాడొకడు చూసి తనయింటికి తీసుకుపోయి పెంచుతూ ఉంటాడు. రాధకూ, ఆ పేదవాడికీ వ్యభిచార సంబంధం కల్పించి పువ్వు జమీందారుకు ఆగ్రహం తెప్పిస్తుంది. జమీందారు నిజం తెలియని కోపంలో రాధ గొంతుక నులిమి వేస్తాడు. ఆమె చనిపోయిందని అంతా అనుకుంటారు కాని, ఆమె తేరుకుని అక్కడా అక్కడా కూలిచేసుకుని పొట్ట పోసుకుంటూ ఉంటుంది. ఇలా చాలా కాలం గడుస్తుంది. జమీందారును తన చేతి కీలు బొమ్మగా చేసుకుని పువ్వు అతన్ని ఆడిస్తూ, చివరికతన్ని ఇంట్లోనే బంధించి వుంచి, చాలా హింసలు పెడుతూ ఉంటుంది. మొదటి భార్యకు పుట్టిన కొడుకు మల్లయ్య (ఎన్. టి. రామారావు) అనే పేరుతో పెరిగి పెద్దవాడవుతాడు. అతను కన్నమ్మ (జమున) అనే కూలీపిల్లను ప్రేమిస్తాడు. చివరకు జమీందారు తన రెండవ భార్య చేసిన ద్రోహం, మొదటి భార్య నిర్దోషిత్వం తెలుసుకుని పశ్చాత్తాప పడతాడు. పువ్వు విషంతాగి ఆత్మహత్య

## "జాతక ఫలం"

కలహం చల్లారిన తరవాత కాశీశ్వరరావు వారిమీద పగసాధించదలచి విఫలుడు కావడం, ఆ తర్వాత తన చావు సమీపిస్తోందని లక్ష్మి దిగులుపడి ఆమె జబ్బు ఎక్కువ కావడం ఇవన్నీ కథను పెంచడానికి తోడ్పడ్డాయి.

అయినా ఈ చిత్రం ప్రేక్షకులకు వినోదం కలిగించడంలో కృతకృత్యమైందనే చెప్పాలి. సన్నివేశాల్లోనూ, సంభాషణల్లోనూ, కావలసినంత హాస్యం ఉన్నది. రంగారావూ, నాగేంద్రరావూ ఈ సన్నివేశాలకు జీవంపోశారు. చిత్రమంతటా ఉన్న హాస్యం మూలంగా ఎక్కడా విసుగు కలగనీయని చక్కని కాలక్షేపం ప్రేక్షకులకు లభ్యమవుతుంది. కోటేటివారి సంభాషణల రచన చక్కగా ఉంది. ఫోటోగ్రఫీ మొదలైన టెక్నికల్ విలువల విషయంలోకూడా ఈ చిత్రం ఏవి. ఎమ్. వారి చిత్రాల స్థాయిలోనే ఉన్నది. ★

చేసుకుంటుంది. జమీందారు తన మొదటి భార్య బాధను, కొడుకు మల్లయ్యను కలుసుకుని సుఖావగం కోరుతాడు. మల్లయ్య కన్నమ్మను వివాహమాడుతాడు. అంతా సుఖంగా ఉంటారు.

ఈ కథ పాతికేళ్ళ కిందట జరిగినట్లు భావించాలని నిర్మాతలు చెందటే తెలియజేశారు. కథే కాకుండా, స్క్రిప్టురచన, దర్శకత్వం, ఛాయాగ్రహణం వగైరాలు కూడా పాతకాలి కొందటి ఎక్కువగా జ్ఞాపకం చేస్తున్నాయి.

## బహుమతులకు అర్హమైన చిత్రాలు

భారతీయ చిత్రాల్లో ఉత్తమమైన వాటిని నిర్ణయించడానికి నియమింపబడిన కేంద్ర కమిటీవారు తమ సలహాలను ఇటీవల ప్రకటించారు.

కథాచిత్రాల్లో అత్రే పిక్చర్సువారు నిర్మించిన "శ్యాంచీ అయీ" (శ్యాముని తల్లి) అనే మరాఠీ చిత్రాన్ని, రాష్ట్రపతి బహుమతికి అర్హమైనదిగా వారు సూచించారు.

బిమల్ రాయ్ ప్రొడక్షన్సువారి "దోబిఘా జమీన్" (హిందీ) చిత్రానికి, దేవకీ బోస్ ప్రొడక్షన్సువారి "భగవాన్ శ్రీ కృష్ణచైతన్య" (బెంగాలీ) చిత్రానికి సర్టిఫికెట్స్ ఆఫ్ మెరిట్ ఇవ్వవచ్చునని సూచించారు.

డాక్యుమెంటరీలలో "మహా బలిపురం" అనేదానికి రాష్ట్రపతి బహుమతిని, "హోలీ హిమాలయాస్," "ట్రీ ఆఫ్ వెల్త్" అనేవాటికి సర్టిఫికెట్స్ ఆఫ్ మెరిట్ ఇవ్వవచ్చునని సూచించారు. ఈ మూటిని ఫిల్మ్స్ డివిజన్‌వారే తయారుచేశారు.

పిల్లల చిత్రాల్లో భారత ప్రధాని బహుమతికి అర్హమైనదేదీ లేకపోవడంవల్ల, "ఖేలా ఘర్" అనే బెంగాలీ చిత్రానికి సర్టిఫికెట్ ఆఫ్ మెరిట్ ఇవ్వాలని సూచించారు.

పోటీకి వచ్చిన చిత్రాల పరిశీలనకు నియమింపబడిన కేంద్ర కమిటీ అధ్యక్షులు శ్రీ మంగళదాస్ పక్వాసా. సభ్యులు డా॥ కాళిదాస్ నాగ్, ప్రొ॥ రామధారి సిన్హా దినకర్, శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయ, పి. వి. దేశాయి, ఎస్. వి. అయ్యర్.



ఇటీవల సోవియెట్ యూనియన్ లో పర్యటించిన భారతీయ సాంస్కృతిక ప్రతినిధి వర్గంతో వెళ్ళిన నర్తకి తారాచౌధురి

## రష్యాలో మన ఫిలిం ప్రతినిధులు

### భారతీయ చిత్రాలకు అఖండ స్వాగతం

సెప్టెంబరు 23వ తేదీన మాస్కోలోనూ, మరో 18 పెద్ద సోవియట్ నగరాల్లోనూ భారతీయ చలన చిత్రోత్సవం ప్రారంభమైంది. ఆవారా, దోబిఘా జమీన్ మొదలైన చిత్రాలు ఒక్క మాస్కోలోనే 80 సినిమా మందిరాల్లో ప్రదర్శింపబడ్డాయి. సోవియట్ సాంస్కృతిక మంత్రి జార్జి అలెగ్జాండ్రోవ్ ఉత్సవాన్ని ప్రారంభిస్తూ, ఈ ఉత్సవం ఇండో సోవియట్ స్నేహ సంబంధాలను అభివృద్ధి చేయగలదని అన్నారు. ఆ రోజు పలువు సోవియట్ ఫిలిం నటీనటులు, డైరెక్టర్లు అనేకులు హాజరయ్యారు.

భారతీయ చిత్రాలకు రష్యన్లు అమోఘమైన స్వాగతం ఇచ్చారని తెలుస్తోంది. చలన చిత్రోత్సవం జరుగుతున్న దానికంటె